# శ్రీగణ  శాయ నమః ఓం నమశ్శివాయ

# వాయవీయ సంహితా (పూర్వభాగః)

## ప్రథమో%ధ్యాయః

## పురాణ స్వరూప నిరూపణము

వ్యాస ఉవాచ |

నమశ్శివాయ సోమాయ సగణాయ ససూనవే | ప్రధానపురుషేశాయ సర్గస్థిత్యంతహేతవే || 1

శక్తిరప్రతిమా యస్య హ్యైశ్వర్యం చాపి సర్వగమ్ | స్వామిత్వం చ ప్రభుత్వం చ స్వభావం సంప్రచక్షతే || 2

తమజం విశ్వకర్మాణం శాశ్వతం శివమవ్యయమ్ | మహాదేవం మహాత్మానం వ్రజామి శరణం శివమ్ || 3

ధర్మక్షేత్రే మహాతీర్థే గంగాకాలిందసంగమే | ప్రయాగే నైమిషారణ్యే బ్రహ్మలోకస్య వర్త్మని || 4

మునయశ్శంసితాత్మానస్సత్యవ్రతపరాయణాః | మహౌజసో మహాభాగా మహాసత్రం వితేనిరే || 5

తత్ర సత్రం సమాకర్ణ్య తేషామక్లిష్టకారిణామ్ | సాక్షాత్సత్యవతీసూనోర్వేదవ్యాసస్య ధీమతః || 6

శిష్యో మహాత్మా మేధావీ త్రిషు లోకేషు విశ్రుతః | పంచావయవయుక్తస్య వాక్యస్య గుణదోషవిత్ || 7

ఉత్తరోత్తరవక్తా చ బ్రువతో %పి బృహస్పతేః | మధురః శ్రవణానాం చ మనోజ్ఞపదపర్వణామ్ || 8

కథానాం నిపుణో వక్తా కాలవిన్నయవిత్కవిః | ఆజగామ స తం దేశం సూతః పౌరాణికోత్తమః || 9

తం దృష్ట్వా సూతమాయాంతం మునయో హృష్టమానసాః | తస్మై#ౕ సామ చ పూజాం చ యథావత్ర్పత్యపాదయన్ || 10

ప్రతిగృహ్య స తాం పూజాం మునిభిః ప్రతిపాదితామ్ | ఉద్దిష్టమాసనం భేజే నియుక్తో యుక్తమాత్మనః || 11

తతస్తత్సంగమాదేవ మునీనాం భావితాత్మనామ్ | సోత్కంఠమభవచ్చిత్తం శ్రోతుం పౌరాణికీం కథామ్ || 12

తదా తమనుకూలాభిర్వాగ్భిః పూజ్య మహర్షయః | అతీవాభిముఖం కృత్వా వచనం చేదమబ్రువన్ || 13

వ్యాసుడు ఇట్లు పలికెను -

జగన్మాతతో, గణములతో మరియు పుత్రులతో కూడియున్నవాడు, ప్రకృతిని మరియు జీవులను నియంత్రించువాడు, సృష్టిస్థితిలయములకు కారణమైనవాడు అగు శివుని కొరకు నమస్కారము (1). ఏ ఈశ్వరుని సాటిలేని శక్తి, సర్వవ్యాపకమగు ఈశ్వరబావము, స్వామి అయి ఉండుట, సర్వమునందు ఉపాదానకారణముగా అనువృత్తమగుట అను లక్షణములు మాయామూలకములని చెప్పబడుచున్నవో (2). పుట్టుక లేనివాడు, జగత్తును సృష్టించినవాడు, శాశ్వతుడు, మంగళకరుడు, వినాశము లేనవాడు, దేవతలలో శ్రేష్ఠుడు, సర్వజగత్తునకు ఆత్మ అయినవాడు అగు అట్టి శివుని శరణు వేడుచున్నాను (3). నైమిషారణ్యములో ధర్మస్థానము, గొప్ప క్షేత్రము, గంగాయమునాసంగమము, బ్రహ్మలోకమునకు మార్గము అగు ప్రయాగలో (4). ప్రశంసించదగిన అంతఃకరణము గలవారు, సత్యము అనే వ్రతమునందు తత్పరత గలవారు, గొప్ప తేజశ్శాలురు, మహాత్ములు అగు మునులు పెద్ద సత్రయాగమును చేసిరి (5). గొప్ప కార్యములను తేలికగా సాధించే ఆ

మహర్షులు అచట సత్రయాగమును చేయుచున్నారని విని, సాక్షాత్తుగా సత్యవతీపుత్రుడు మరియు మహాబుద్ధిశాలియగు వేదవ్యాసుని శిష్యుడు, మహాత్ముడు, ప్రజ్ఞాశాలి, ముల్లోకములలో పేరు గాంచినవాడు, అయిదు అంశములు గల తార్కికుల అనుమానవాక్యములలోని గుణదోషములు తెలిసినవాడు (6, 7), బృహస్పతి అడిగే ప్రశ్నలకైననూ ఉత్తరమునీయగలవాడు చెవులకు ఇంపుగా మనస్సునకు ఉల్లాసమును కలిగించు విధముగా అందమగు పదములతో కథలను చెప్పుటలో నిష్ణాతుడు, కాలస్వరూపము తెలిసినవాడు, నీతిశాస్త్ర వేత్త, మహాజ్ఞాని, పౌరాణికులలో ఉత్తముడు అగు సూతుడు ఆ స్థానమునకు విచ్చేసెను (8,9). ఆ సూతమహర్షి వచ్చుచుండగా చూచి ఆనందముతో నిండిన హృదయములు గల మహర్షులు ఆయనకు ఎదురేగి స్వాగతవచనములను పలికి యథావిదిగా పూజించిరి (10). మునులచే ఈయబడిన ఆ సత్కారమును ఆయన స్వీకరించి, వారిచే చూపించబడి తనకు ఉద్దేశించబడిన తనకు తగిన ఆసనమునందు కూర్చుండెను (11). పవిత్రమగు అంతఃకరణముగల మునులకు ఆయనను కలియుట మాత్రము చేతనే మనస్సులో పురాణగాథను వినాలనే ఉత్కంఠ బయలుదేరెను (12). అపుడు ఆ మహర్షులు ఆయనను మదురవచనములతో పూజించి, తమ విషయములో మిక్కిలి ప్రసన్నముగా చేసుకొని, ఈ విధముగా పలికిరి (13).

ఋషయ ఊచుః |

రోమహర్షణ సర్వజ్ఞ భవాన్మే భాగ్యగౌరవాత్ | సంప్రాప్తో%ద్య మహాభాగ శైవరాజ మమామతే || 14

పురాణవిద్యామఖిలాం వ్యాసాత్ప్రత్యక్షమీయివాన్ |
తస్మాదాశ్చర్యభూతానాం కథానాం త్వం హి భాజనమ్ || 15

రత్నానాముురుసారాణాం రత్నాకర ఇవార్ణవః | యచ్చ భూతం యచ్చ భవ్యం యచ్చాన్యద్వస్తు వర్తతే || 16

న తవావిదితం కించిత్త్రిషు లోకేషు విద్యతే |
త్వమదృష్టవశాదస్మద్దర్శనార్థమిహాగతః |

అకుర్వన్ కిమపి శ్రేయో న వృథా గంతుమర్హసి || 17

తస్మాచ్ఛ్రావ్యతరం పుణ్యం సత్కథాజ్ఞానసంహితమ్ |
వేదాంతసారసర్వస్వం పురాణం శ్రావయాశు నః || 18

ఏవమభ్యర్థితస్సూతో మునిభిర్వేదవాదిభిః | శ్లక్ ష్ణాం చ
న్యాయసంయుక్తాం ప్రత్యువాచ శుభాం గిరమ్ || 19

ఋషులు ఇట్లు పలికిరి -

రోమహర్షణా! (శరీరములో గగుర్పాటు కలిగే విధముగా కథలను చెప్పువాడా!) మహాత్మా! శివభక్తాగ్రగణ్యా! మహాబుద్ధిశాలీ! మాభాగ్యము గొప్పది అగుట వలన సర్వజ్ఞుడవగు నీవు ఈనాడు ఇచటకు విచ్చేసితివి (14). నీవు సాక్షాత్తుగా వ్యాసుని వద్దనుండి సమస్తమగు పురాణవిద్యను పొందియుంటివి. కావున, గొప్ప విలువైన రత్నములకు సముద్రము వలె, ఆశ్చర్యకరమగు గాథలకు నీవు నిధివి. భూతభవిష్యద్వర్తమానకాలములలో ముల్లోకములలో ఏయే వస్తువులు గలవో, వాటిలో నీకు తెలియనిది ఏదీ లేదు. నీవు మా భాగ్యవశముచే మమ్ములను చూచుటకు ఇచటకు వచ్చితివి. మాకు ఏదో కొంత శ్రేయస్సును కలిగించకుండగా వ్యర్థముగా మరలి పోవుట నీకు తగదు (15 - 17). కావున, వినుటకు ఇంపైనది. పవిత్రమైనది, మంచి కథల జ్ఞానముయొక్క సమాహారరూపమైనది, ఉపనిషత్తుల సారమునంతనూ తనలో ఇముడ్చుకున్నది అగు పురాణమును మాకు వెంటనే వినిపింపుము (18). వేదవేత్తలగు ఆ మునులచే అభ్యర్థింపబడిన సూతుడు అర్థగౌరవము గలది, మధురమైనది, శుభకరమైనది అగు వచనమును ఈ విధముగా బదులు చెప్పను (19).

సూత ఉవాచ |

పూజితోఽను గృహీతశ్చ భవద్భిరితి చోదితః | కస్మాత్సమ్యఙ్ న విబ్రూయాం పురాణమృషిపూజితమ్ || 20

అభివంద్య మహాదేవం దేవీం స్కందం వినాయకమ్ | నందినం చ తథా వ్యాసం సాక్షాత్సత్యవతీసుతమ్ || 21

వక్ష్యామి పరమం పుణ్యం పురాణం వేదసమ్మితమ్ | శివజ్ఞానార్ణవం సాక్షాద్భుక్తిముక్తిఫలప్రదమ్ || 22

శబ్దార్థన్యాయసంయుక్తైరాగామార్థైర్విభూషితమ్ | శ్వేతకల్ప ప్రసంగేన వాయునా కథితం పురా || 23

విద్యాస్థానాని సర్వాణి పురాణానుక్రమం తథా | తత్పురాణస్య చోత్పత్తిం బ్రువతో మే నిబోధత || 24

అంగాని వేదాశ్చత్వారో మీమాంసాన్యాయవిస్తరః | పురాణం ధర్మశాస్త్రం చ విద్యాశ్చైతాశ్చతుర్దశ || 25

ఆయుర్వేదో ధనుర్వేదో గంధర్వశ్చేత్యనుక్రమాత్ | అర్థశాస్త్రం పరం తస్మాద్విద్యా హ్యష్టాదశ స్మృతాః || 26

అష్టాదశానాం విద్యనామేతాసాం భిన్నవర్త్మనామ్ | ఆదికర్తా కవిస్సాక్షాచ్ఛూలపాణిరితి శ్రుతిః || 27

స హి సర్వజగన్నాథస్సిసృక్షురఖిలం జగత్ | బ్రహ్మాణం విదధే సాక్షాత్పుత్రమగ్రే సనాతనమ్ || 28

తస్మై#ం్మ ప్రథమపుత్రాయ బ్రహ్మణ విశ్వయోనయే | విద్యాశ్చేమా దదౌ పూర్వం విశ్వసృష్ట్యర్థమీశ్వరః || 29

పాలనాయ హరిం దేవం రక్షాశక్తిం దదౌ తతః | మధ్యమం తనయం విష్ణుం పాతారం బ్రహ్మణోఽపిహి || 30

సూతుడు ఇట్లు పలికెను -

ఈ విధముగా నన్ను ప్రేరేపించుట ద్వారా మీరు నన్ను పూజించి అనుగ్రహించినారు. ఇట్టి స్థితిలో ఋషులచే పూజింపబడే పురాణమును చక్కగా ఏల చెప్పకుందును? (20) మహాదేవుని, పార్వతీదేవిని, కుమారస్వామిని, వినాయకుని, నందీశ్వరుని మరియు సాక్షాత్తుగా సత్యవతియొక్క పుత్రుడగు వ్యాసుని నమస్కరించి (21), పరమపవిత్రమైనది, వేదముతో సమానమైనది, శివజ్ఞానమునకు సముద్రము వంటిది, సాక్షాత్తుగా భుక్తి మరియు ముక్తి అనే ఫలములను ఇచ్చునది, సుందరమగు శబ్దములు అర్థాలంకారములు యుక్తులు వేదార్థములు అనువాటితో కూడి శోభిల్లునది అగు పురాణమును చెప్పెదను. శ్వేతవరాహకల్పమునందు పూర్వము దీనిని వాయువు చెప్పియున్నాడు (22, 23).
సకలవిద్యాస్థానములను, పురాణముల క్రమమును, ఆ పురాణముల ఉత్పత్తిని నేను చెప్పెదను; గమనించుడు (24). ఆరు వేదాంగములు (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము, కల్పము, నిరుక్తము), నాలుగు వేదములు, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము మరియు ధర్మశాస్త్రము అను పదునాలుగు విద్యలు గలవు (25). వీటకి ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వవేదములను మరియు అర్థశాస్త్రమును కలిపినచో, పదునెనిమిది విద్యలు అగునని మహర్షులు చెప్పుచున్నారు (26). వివిధవిషయములను బోధించే ఈ పదునెనిమిది విద్యలను సృష్టికి ఆరంభములో సర్వజ్ఞుడు, పినాకపాణి అగు శివుడే స్వయముగా రచించినాడని వేదములు చెప్పుచున్నవి (27). సర్వజగత్తులకు తండ్రియగు ఆ శివుడు సకలజగత్తులను సృష్టించగోరి, ముందుగా సనాతనుడగు బ్రహ్మను సాక్షాత్తుగా తన పుత్రునిగా సృజించెను (28). సృష్టికర్త, ఈశ్వరుని మొదటి పుత్రుడు అగు ఆ బ్రహ్మకు ఈశ్వరుడు పూర్వమునందు జగత్తులను సృష్టించుట కొరకై ఈ విద్యలను ఇచ్చియుండెను (29). తరువాత ఆయన తన మధ్యమపుత్రునిగా మరియు బ్రహ్మకు రక్షకునిగా విష్ణుదేవుని సృష్టించి, ఆయనకు రక్షించే సామర్థ్యము నొసంగెను (30).

లబ్ధవిద్యేన విధినా ప్రజాసృష్టిం వితన్వతా | ప్రథమం సర్వశాస్త్రా
ణాం పురాణం బ్రహ్మణా స్మృతమ్ || 31

అనంతరం తు వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః |
ప్రవృతిస్సర్వశాస్త్రాణాం తన్ముఖాదభవత్తతః || 32

యదాస్య విస్తరం శక్తా నాధిగంతుం ప్రజా భువి | తదా
విద్యాసమాసార్థం విశ్వేశ్వరనియోగతః || 33

ద్వాపరాంతేషు విశ్వాత్మా విష్ణుర్విశ్వంభరః ప్రభుః | వ్యాసనామ్నా
చరత్యస్మిన్నవతీర్య మహీతలే || 34

ఏవం వ్యస్తాశ్చ వేదాశ్చ ద్వాపరే ద్వాపరే ద్విజాః | నిర్మితాని పురాణాని
అన్యాని చ తతః పరమ్ || 35

న పునర్ద్వాపరే చాస్మిన్ కృష్ణద్వైపాయనాఖ్యయా | అరణ్యామివ
హవ్యాశీ సత్యవత్యామజాయత || 36

సంక్షిప్య చ పునర్వేదాంశ్చతుర్ధా కృతవాన్మునిః | వ్యస్తవేదతయా లోకే
వేదవ్యాస ఇతి శ్రుతః || 37

పురాణానాం చ సంక్షిప్తం చతుర్లక్షప్రమాణతః | అద్యాపి దేవలోకే
తచ్ఛతకోటిప్రవిస్తరమ్ || 38

యో విద్యాచ్చతురో వేదాన్ సాంగోపనిషదాన్ ద్విజః | న చేత్పురాణం
స విద్యాన్నైవ స స్యాద్విచక్షణః || 39

ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ |
బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి || 40

బ్రహ్మ విద్యలను పొంది ప్రజలను సృష్టించుచూ, సర్వశాస్త్రములలో
ప్రధానమగు పురాణమును స్మరించెను (31). తరువాత ఆయన
ముఖములనుండి వేదములు ఉద్భవించినవి. తరువాత ఆయన
ముఖమునుమడి సకలశాస్త్రములు పుట్టినవి (32). భూలోకములో

జనులకు ఈ విశాలమగు పురాణవాఙ్మయమును తెలసుకొనే సామర్థ్యము లేకుండెను. అపుడు ఈ విద్యలను సంగ్రహించి చిన్నవిగా చేయుట కొరకై విశ్వేశ్వరునిచే ఆదేశింపబడి (33), జగత్తునకు ఆత్మయై జగత్తును దక్షించువాడు, సర్వసమర్థుడు అగు విష్ణువు వ్యాసుడు అను పేరుతో ఈ భూలోకమునందు అవతరించి సంచరించుచున్నాడు (34). ఓ బ్రాహ్మణులారా! ఈ విధముగా ప్రతి ద్వాపరయుగమునందు వేదములు విభాగము చేయబడును. తరువాత పురాణములు, మరియు ఇతరశాస్త్రములు నిర్మించబడును (35). ఆ వ్యాసుడు ద్వాపరయుగమునందు కృష్ణద్వైపాయనుడు అను పేరుతో అరణియందు అగ్ని వలె సత్యవతియందు జన్మించెను (36). ఆ ముని వేదములను సంక్షేపము చేసి నాలుగు భాగములుగా విభజించెను. అట్లు విభాగమును చేయుటచే ఆయనకు లోకమునందు వేదవ్యాసుడను ప్రసిద్ధి కలిగినది (37). ఈ నాటికీ దేవలోకములో వంద కోట్ల శ్లోకముల విస్తారము గల పురాణములను ఆయన నాలుగు లక్షల శ్లోకములలోనికి సంక్షేపించినాడు (38). నాలుగు వేదములను అంగములతో మరియు ఉపనిషత్తులతో సహా నేర్చిన బ్రాహ్మణుడైననూ, పురాణములను తెలియకున్నచో ఆతడు పండితుడు కాజాలడు (39). వేదముల అర్థమును ఇతిహాసపురాణముల సహాయ్యముతో వ్యాఖ్యానించి విస్తరింపజేయ వలెను. తక్కువ విజ్ఞానము గలవానిని చూచి వీడు నన్ను మోసగించునని వేదము భయపడుచుండును (40).

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ | వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్ || 41

దశధా చాష్టధా చైతత్పురాణముపదిశ్యతే | బృహత్సూక్ష్మప్రభేదేన మునిభిస్తత్త్వవిత్తమైః || 42

బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా | భవిష్యం నారదీయం చ మార్కండేయమతః పరమ్ || 43

ఆగ్నేయం బ్రహ్మవైవర్తం లైంగం వారాహమేవ చ | స్కాందం చ వామనం చైవ కౌర్మం మాత్స్యంచ గారుడమ్ || 44

బ్రహ్మాండం చేతి పుణ్యో%యం పురాణానుమనుక్రమః | తత్ర శైవం తురీయం యచ్ఛార్వం సర్వార్థసాధకమ్ || 45

గ్రంథో లక్షప్రమాణం తద్వ్యస్తం ద్వాదశసంహితమ్ | నిర్మితం తచ్ఛివేనైవ తత్ర ధర్మః ప్రతిష్ఠితః || 46

తదుక్తేనైవ ధర్మేణ శైవాసై#్ర వర్ణికా నరాః | తస్మాద్విముక్తిమన్విచ్ఛన్ శివమేవ సమాశ్రయేత్ || 47

తమాశ్రిత్యైవ దేవానామపి ముక్తిర్న చాన్యథా || 48

యదిదం శైవమాఖ్యాతం పురాణం వేదసంమితమ్ | తస్య భేదాన్ సమాసేన బ్రువతో మే నిబోధత || 49

సృష్టి, అవాంతరసృష్టి, రాజవంశములు, మన్వంతరములు, వివిధకాలములలో రాజవంశముల చరిత్ర అను ఐదు అంశములు పురాణములలో వర్ణింపబడును (41). తత్త్వవేత్తలలో అగ్రగణ్యులగు మునులు పది పెద్ద పురాణములను, ఎనిమిది సూక్ష్మ (తక్కువ శ్లోకసంఖ్య గలవి) పురాణములను ఉపదేశించుచున్నారు (42). బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, భాగవత, భవిష్య, నారద, మార్కండేయ (43), అగ్ని, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, స్కాంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ (44), బ్రహ్మాండ పురాణములు అనే ఈ పురాణ క్రమము పవిత్రమైనది. దానిలో నాల్గవది యగు శివపురాణము లయకర్తయగు శివుని గురించి బోధించి సకలప్రయోజనములను సిద్ధింప జేయును (45). లక్ష బోధింపబడియున్నది (46). మూడు వర్ణముల మానవులు దానిలో చెప్పబడిన ధర్మముచే మాత్రమే శివభక్తులు అగుచున్నారు. కావున, మోక్షమును కోరు మానవుడు శివుని మాత్రమే శరణు వేడవలెను (47). దేవతలకైననూ శివుని ఆశ్రయించుటచే మాత్రమే మోక్షము లభించును; మరియొక

మార్గము లేదు (48). ఈ శివపురాణము వేదములతో సమానమైనదని నేను చెప్పియుంటిని. దానిలోని విభాగములను సంగ్రహముగా చెప్పెదను. తెలుసుకొనుడు (49).

విద్యేశ్వరం తథా రౌద్రం వైనాయకమనుత్తమమ్ | ఔమం మాతృపురాణం చ రుద్రైకాదశకం తథా || 50

కైలాసం శతరుద్రం కోటిరుద్రాఖ్యేమవ చ | సహస్రకోటిరుద్రాఖ్యం వాయవీయం తతః పరమ్ || 51

ధర్మసంజ్ఞం పురాణం చేత్యేవం ద్వాదశ సంహితాః | విద్యేశం దశసాహస్రముదితం గ్రంథసంఖ్యయా || 52

రౌద్రం వైనాయకం చౌమం మాతృకాఖ్యం తతః పరమ్ | ప్రత్యేకమష్టసాహస్రం త్రయోదశసహస్రకమ్ || 53

రుద్రై కదశకాఖ్యం యత్కైలాసం షట్ సహస్రకమ్ | శతరుద్రం త్రిసాహస్రం కోటిరుద్రం తతః పరమ్ || 54

సహస్రై#్ర ర్నవభిర్యుక్తం సర్వార్థజ్ఞానసంయుతమ్ | సహస్రకోటిరుద్రాఖ్యమేకాదశసహస్రకమ్ || 55

చతుస్సహస్రసంఖ్యేయం వాయవీయమనుత్తమమ్ | ధర్మసంజ్ఞం పురాణం యత్తద్ద్వా దశసహస్రకమ్ || 56

తదేవం లక్షముద్ధిష్టం శైవం శాకావిభేదతః | పురాణం వేదసారం తద్భుక్తి ముక్తిఫలప్రదమ్ || 57

వ్యాసేన తత్తు సంక్షిప్తం చతుర్వింశత్సహస్రకమ్ | శైవం తత్ర పురాణం వై చతుర్థం సప్తసంహితమ్ || 58

విద్యేశ్వరాఖ్యా తత్రాద్యా ద్వితీయా రుద్రసంహితా | తృతీయా శతరుద్రాఖ్యా కోటిరుద్రా చతుర్థికా || 59

పంచమీ కథితా చోమా షష్ఠీ కైలాససంహితా | సప్తమీ వాయవీయాఖ్యా సప్తైవం సంహితా ఇహ || 60

విద్యేశ్వర-రుద్రసంహితలు, సర్వశ్రేష్ఠమగు వినాయకసంహిత, ఉమాసంహిత, మాతృపురాణము, రుద్రైకాదశక (50). కైలాస, శతరుద్ర, కోటిరుద్ర, సహస్రకోటిరుద్ర, వాయవీయ (51), ధర్మపురాణసంహితలు అనే పన్నెండు సంహితలు ఈ పురాణమునందు గలవు. విద్యేశ్వరసంహితయందు పదివేల శ్లోకములు గలవని చెప్పబడినది (52). రుద్ర, వినాయక, ఉమా, మాతృకములనే సంహితలలో ఒక్కొక్క దానియందు ఎనిమిది వేలు, రుద్రై కాదశకసంహితయందు పదమూడు వేలు, కైలాససంహితయందు ఆరు వేలు, శతరుద్రసంహితయందు మూడు వేలు, కోటిరుద్రసంహితయందు తొమ్మిది వేలు, శ్లోకములు గలవు. సర్వవిషయముల జ్ఞానముతో కూడియున్న సహస్రకోటిరుద్రసంహితయందు పదకొండు వేల శ్లోకములు గలవు (53, 55). సర్వశ్రేష్ఠమగు ఈ వాయవీయసంహితలో నాలుగు వేలు, ధర్మపురాణసంహితయందు పన్నెండు వేల శ్లోకములు గలవు (56). ఈ విధముగా వేదముల సారము, భుక్తి మరియు ముక్తి అనే ఫలములను ఇచ్చునది అగు శివపురాణములోని లక్ష శ్లోకములు వివిధసంహితల రూపములో విభజింపబడి యున్నవి (57). వ్యాసుడు దానిని ఇరవై నాలుగు వేల శ్లోకములలోనికి కుదించినాడు. పురాణములలో నాల్గవది యగు ఈ శివపురాణమునందు ఏడు సంహితలు గలవు (58). దానిలో మొదటిది విద్యేశ్వరసంహిత. రెండవది రుద్రసంహిత, మూడవది శతరుద్రసంహిత, నాల్గవది కోటిరుద్రసంహిత (59). అయిదవది ఉమాసంహిత, ఆరవది కైలాససంహిత, ఏడవది వాయవీయ సంహిత. ఈ విధముగా దీనియందు ఏడు సంహితలు గలవు (60).

విద్యేశ్వరం ద్విసాహస్రం రౌద్రం పంచశతాయుతమ్ | త్రింశత్తథ ద్విసాహస్రం సార్ధైకశతమీరితమ్ '' 61

శతరుద్రం తథా కోటిరుద్రం వ్యోమయుగాధికమ్ | ద్విసాహస్రం చ ద్విశతం తథోమం భూసహస్రకమ్ || 62

చత్వారింశత్సాష్టశతం కైలాసం భూసహస్రకమ్ | చత్వారింశచ్చ ద్విశతం వాయవీయమతః పరమ్ || 63

చతుస్సహస్రసంఖ్యాకమేవం సంఖ్యావిభేదతః | శ్రుతం పరమపుణ్యం తు పురాణం శివసంజ్ఞకమ్ || 64

చతుస్సహస్రకం యత్తు వాయవీయముదీరితమ్ | తదిదం వర్తయిష్యామి భాగద్వయసమన్వితమ్ || 65

నావేదవిదుషే వాచ్యమిదం శాస్త్ర మనుత్తమమ్ | న చైవాశ్రద్ధధానాయ నాపురాణవిదే తథా || 66

పరీక్షితాయ శిష్యాయ ధార్మికాయానసూయవే | ప్రదేయం శివభక్తాయ శివధర్మానుసారిణ || 67

పురాణసంహితా యస్య ప్రసాదాన్మయి వర్తతే | నమో భగవతే తసై#ౕ వ్యాసాయామితతేజసే || 68

ఇతి శ్రీశివమహాపురాణ వాయవీయసంహితాయాం పూర్వభాగే విద్యావతారకథనం నామ ప్రథమో%ధ్యాయః (1).

విద్యేశ్వరసంహితయందు రెండు వేలు, రుద్రుసంహితయందు పదివేల అయిదు వందలు, శతరుద్రసంహితయందు రెండు వేల నూట ఎనభై, కోటిరుద్రసంహితయందు రెండు వేల రెండు వందల నలభై, ఉమాసంహితయందు ఒక వేయి ఎనిమిది వందల నలభై, కైలాససంహితయందు ఒక వేయి రెండు వందల నలభై మరియు వాయవీయ సంహితయందు నాలుగు వేల శ్లోకములు గలవు. ఈ విధముగా పరమపవిత్రమగు శివపురాణములో శ్లోకముల సంఖ్య చెప్పబడినది (61-64). నాలుగు వేల శ్లోకములతో రెండు భాగములుగా విభజింపబడి యున్న ఈ వాయవీయసంహితను నేను

ఇప్పుడు ఆరంభించి చెప్పెదను (65). సర్వోత్తమమగు ఈ శాస్త్రమును వేదవేత్త కానివానికి, శ్రద్ధ లేనివానికి మరియు పురాణములు తెలియని వానికి చెప్పరాదు (66). ధర్మబుద్ధి గలవాడు, అసూయ (గుణములయందు దోషములను ఎత్తి చూపుట) లేనివాడు, శివభక్తుడు, శివధర్మమును అనుసరించువాడు అగు శిష్యుని పరీక్షించి చెప్పవలెను (67). ఎవని అనుగ్రహముచే నాకు పురాణజ్ఞానము అలవడినదో, మహాతేజశ్శాలియగు అట్టి వ్యాసభగవానునకు నమస్కారమగుగాక! (68).

శ్రీశివమహాపురాణములోని వాయవీయసంహితలో పూర్వభాగమునందు పురాణ స్వరూపమును నిరూపించే మొదటి అధ్యాయము ముగిసినది (1).